## గంటుల పంచాంగం

పార్థివ సం॥ ఆశ్వయుజ శు॥ షష్ఠి
1945 సం॥ అక్టో 12 శుక్రవారం
తి॥ ష రా 8-31 మూల పూర్తి వర్జ్యం ప 2-50 ను 4-33 కు.
శు॥ సప్తమి అక్టో 13 శనివారం
తి॥ స రా 9-27 మూ ఉ7-57 వర్జ్యం ఉ 7-57 కు.

ఆంధ్రపత్రిక
పార్థివ సం॥ ఆశ్వయుజ శు॥ షష్ఠి
శుక్రవారము

# శాంతిస్థాపన

విదేశమంత్రులసభ భగ్నమవుటను గురించి రష్యన్ పత్రిక ఇజ్వెస్టియా చెప్పినట్లు "అనేకవిధములైన కారణములు తెలియజేయబడి" "విఫలతకు బాధ్యతను, ఇతరులకు అంటగట్టు భావము వ్యక్తమవుతున్నది." ఈ సభ సమావేశానంతరము త్రైరాజ్య మంత్రులు చేసిన ప్రసంగములు రష్యన్ పత్రిక చేసిన వ్యాఖ్యానమును ధృవపరచుచున్నవి. అయితే రష్యా కూడ అట్టి ప్రయత్నములలో భాగము పంచుకోనలసి యున్నది.

రష్యా వైఖరికి కారణము లేవైనను బర్లిన్ నిర్ణయములకు ప్రప్రథమములో చేసిన అర్థమును ఆమోదించి పిమ్మట తిరస్కరించెనని విదితమవుచున్నది. "సెప్టెంబరు పదకొండునుంచి పదిరోజుల వరకు మాలటావు మాతో (అర్థము విషయమున) ఏకీభవించుచునే యున్నట్లు కనుపడెను. మేమూ మరొకవిధముగా అనుకోలేదు. ఆ తరువాత ఆతడు వహించిననూతన వైఖరికి తన ప్రభుత్వము పంపిన ఆదేశము కారణమని మాతో చెప్పినాడు." అని బ్రిటిషు విదేశాంగమంత్రి ఎర్నెస్టు బెవిన్ కామన్సుసభలో చేసిన ఉపన్యాసములో తెలియజేసెను. "రాజ్యాధిపతులు చేసికొనిన ఒడంబడికను దాటి వ్యవహరించుటకు విదేశాంగమంత్రులకు అధికారము లేదు." అని రష్యావిదేశాంగమంత్రి మాలటావు సభ విఫలమైనదని ప్రకటింపబడిన తరువాత పత్రికావిలేఖరుల సభలో చేసిన ప్రసంగము బెవిన్‌గారి కథనమును బలపరచుచున్నది. ఆయా మంత్రుల వివరణలో బాధ్యతను ఇతరులమీద వేయు ప్రయత్నమున్ననూ పరస్పర ద్వేషభావము మాత్రము కనుపించుటలేదు. ఇది ముందు ప్రయత్నములకు శుభసూచకమని చెప్పవచ్చును.

అసలీ సభ భగ్నమవుటకు తాత్కాలికముగా ఆయా విదేశాంగమంత్రుల వైఖరి మూలమని చెప్పినప్పటికీ కారణములు వేరు. ఈసభా వ్యవహారములు, ప్రపంచదృష్టినుండి కప్పివైచి కేవలము ముసుగులో గ్రుడ్డిలాటగా నడుపుట విఫలతకు ప్రథమకారణము. బెర్లిన్ ఒడంబడిక ప్రకటితమై యుండిన వారూ, వారూ, తెలియజెప్పే కథల ననుసరించి కాక ప్రజలు తమంతతాము అర్థము చెప్పుకొని యుండెడివారు. అదీకాక ఈ సమావేశము కేవలము పంచ రాజ్యముల లేక త్రైరాజ్యముల మంత్రులతోనే జరుపుట కూడ భగ్నమవుటకు మరొక కారణము. పంచరాజ్యములు పాల్గొనవలెనని బ్రిటను, అమెరికాలు, పట్టుపట్టుటలోను త్రైరాజ్యములు మాత్రమే ఆధిపత్యము వహించవలెనని రష్యా పట్టుపట్టుటలోనూ, పైకేమి చెప్పినప్పటికీ, దానికి వేరే అంతరార్థము లేకపోలేదు. అందువల్ల ఈ రెండు పద్ధతులను విరమించి అసలు శాంతి సమావేశము నే ఏర్పరచుట ఉత్తమము. రష్యా ప్రతినిధిని తృప్తిపరచుటకు అమెరికను ప్రతినిధి సూచించినమార్గము కూడ అంత తృప్తికరమైనది కాదు. శాంతి ఒడంబడికను ముందుగా, త్రైరాజ్యములు నిర్మించి, దానిని పంచరాజ్య ప్రతినిధుల సభ అంగీకారమునకు దాఖలుచేయవలెననీ అపుడు అక్షరాజ్యముల ఓటమికి ఘనముగా సాయపడిన, దేశప్రతినిధు లందరినీ ఆహ్వానించవలెననీ అమెరికా ప్రతినిధి బైర్నెస్ సూచన అయియున్నది. అలాంటి సభలో తమ పని త్రోసిరాజనుటని మాలటావు అంగీకరింపలేదు. ప్రపంచముపై పోలీసు రక్షణాధికారము, పంచరాజ్యముల కుండవలెనని ఆంగ్ల అమెరికా దేశములు పట్టుపడుచున్నవి. కాదు మూడురాజ్యములకే ఉండవలెనని రష్యా పట్టుబడుచున్నది. ఈ రెండు ఏర్పాటులలో తమతమకు సిద్ధించగల ఆధిక్యతనుబట్టి వారి తిరస్కారాంగీకార భావములు వచ్చుచున్నవి.

కాబట్టి సవ్యమైన న్యాయమైన శాంతి ఒడంబడికలు ఏర్పడుటకు అనుమానాస్పదమైన ఈ పద్ధతులు కాక, అక్షరాజ్యముల పతనమునకు తోడ్పడిన రాజ్యముల ప్రతినిధులందరితోనూ సమావేశము జరుగవలసి యున్నది. అమెరికా వారి సూచన ప్రకారము అక్షరాజ్యముల ఓటమికి 'ఘనముగా' తోడ్పడిన వారినే ఆహ్వానించవలసియున్నది. ఈ "ఘనముగా" అన్నదానికి అంతరార్థమేమో తెలియదు. ఏమైనప్పటికీ కూడ, ఏవిధమైన విచక్షణ లేక సర్వరాజ్య ప్రతినిధులను ఆహ్వానించుట అవసరము. శాంతిసిద్ధికి, రక్షణకు యావద్దేశములు సహకారము చేసినపుడే సాధ్యమవును గాని యుద్ధములో ఎక్కువగా పాల్గొనినవారే ఆధిపత్యము వహించుటవల్ల సాధ్యము కాదు.

లండను సభ విఫలతను గూర్చి వ్యాఖ్యానించుచూ ఆస్ట్రేలియా విదేశమంత్రి డా॥ ఇవాట్ - ఒక మార్గమును సూచించుచున్నారు. ఈ పర్యాయము ఏర్పాటు కాబోవు సభకు అధినివేశములు, భారతదేశము, మిత్రమండలి పక్షమున పాల్గొనిన ఇతర దేశములను ఆహ్వానించవలెనని ఐర్లండును మాత్రము ఆహ్వానించకూడదనిరి. ఐర్లండు యుద్ధములో పాల్గొనక పోవుటవలన ఆ దేశమును వెలివేయవలెనని వీరి భావము కావచ్చును. కాని యుద్ధములో తటస్థముగ యుండుటవల్లనే ఐర్లండునిర్మలమైన దృక్పథముతో చర్చలలో పాల్గొనుటకు అవకాశము కలదు. విజ్ఞులుకొందరు శాంతి సమావేశములో అక్షరాజ్య ప్రతినిధులు కూడ పాల్గొనవలెనని చెప్పుచున్నారు. అపుడు గాని శాంతికి ఏకస్వామ్యము, అవిభాజ్యత, సంక్రమింపజాలవు.

మద్రాసుజిల్లా కాంగ్రెసు సంఘం

మద్రాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు కార్యాలయం రోజూ సాయంత్రం 4-6 గంటల మధ్య ఆక్సినియన్ కీప్ నెం 117 లోనికి మార్చబడినదని కార్యదర్శి చల్లా బాయిగారు వ్రాస్తున్నారు.

## ఇండొనీషియా జాతీయోద్యమం

### జాతీయవాదులకు జపానువారి సాయం

లండన్, అక్టోబరు 10: సైగాన్‌నుంచి ఇక్కడికి ఆలస్యంగా చేరిన నిన్నటివార్తనుబట్టి, ఇండోచైనా దక్షిణాత్యాన అనేక ప్రదేశాలలో జపాను సైనికులకును అన్నామ్ జాతీయవాదులకును తిరిగి పోరాటం తీవ్రత అంటుకొన్నదని తెలుస్తోంది.

ఒక సైగాన్, శాంతి సంక్షోభాల రెంటికి నట్టనడుమ కత్తిఅంచున నడుస్తున్నట్లున్నది. మూసివేసిన దుకాణాలు కొన్ని తిరిగి తెరిచారు. ఆహారపరిస్థితి ఇప్పుడు పనకటికంటె కొంచెం మెరుగ్గా ఉంది. ప్రజలంతా ఫ్రెంచివారికిని జాతీయవాదులకును జరిగిన సంభాషణల ఫలితాల కై తీవ్రాతురతతో ఎదురు చూస్తున్నారు. సంభాషణలగూర్చి వివరమైన వ్యాఖ్యలేమీ ఇంతవరకు జరగలేదు.

శాంతిస్థాపనకై మిత్రరాజ్యాలు జారీ చేసిన ఉత్తరువులను జపానుసేనలు అమలు జరిపే ప్రయత్నం లో, జపానువారికిని జాతీయవాదులకును పోరాటం ప్రారంభమైందని మిత్రరాజ్య అధికారిఒకరు అన్నాడు.

మిత్రదేశాల ఉత్తరువుల ప్రకారం అనుమతిలేకుండా ఆయుధాలుగ్రహించే ప్రతివారిని జపానువారు నిరాయుధులుగా చెయ్యాలి.

ఫ్రెంచి దూరప్రాచ్య సేనానియైన జనరల్ లెక్లర్క్ ఇండోచైనా ప్రజకు నేడొక ప్రకటన కావించాడు.

'ప్రజాతంత్ర సిద్ధాంతాల ప్రకారం క్రమితగతిలో ఇండోచైనాకి ఏ రాజకీయ హోదా పొందడానికి అధికార ముందో ఆ రాజకీయ హోదా ఇండోచైనాకు తప్పక లభించగలదు.' అని ఆ ప్రకటనలో వెల్లడిచేశాడు.

మధ్య జావాలో జపానుసేనలు తమ ఆయుధాలూ మందుగుండు సామానూ ఇండొనీషియా జాతీయవాదుల కైవసం చేస్తున్నారని బటేవియా నుంచి ఒక వార్త వచ్చింది. ఇండొనీసియనుల బలాత్కార చర్యలవల్ల అలా చేయవలసి వచ్చిందని జపానుసైనికు లన్నారు. కాని బయటికి ఈ సాకు చెప్పి జాతీయవాదులను బలపరచటానికై స్వయంగానే జపానువారు ఆయుధాలు అప్పజెప్పియుండవచ్చును అని మిత్రరాజ్యాల తరఫున పనిచేస్తున్న ఒక ఉద్యోగి అన్నాడు.

ఈ సంకట సమయంలో పురా ఇండొనీషియా సైనికులందరు సమకూడి దేశానికి అండ కావలెనని జాతీయ పత్రిక 'మెర్డెకా' ప్రకటించింది.

ఇండొనీషియా సేన లొంగుబాటు జరిగిన తరువాత, జపానువారు సైనికులందరిని నిరస్త్రులను కావించి సేనకు ఉద్వాసం చెప్పారు. సైనికుల సంఖ్య 100,000 నుంచి 300,000 వరకు ఉండవచ్చునని అంచనాలున్నవి. జాతీయోద్యమంలో పాల్గొనుటకై ఈ సైనికులలో చాలమంది డా॥ సొకార్నో పక్షాన సమకూడారు.

## పారిస్‌లో 50 మంది ఇండో - చైనావారి ఎరెస్టు

పారిస్, అక్టోబరు 10: పారిస్‌లో ఉన్న ఇండో-చైనావారి కార్యాలయం ముట్టడించి ఫ్రెంచివారు 50 మంది ఇండోచైనావారిని ఎరెస్టుచేశారన్న వార్తను ఫ్రెంచి న్యాయశాఖవారు ధ్రువపరిచారు.

బియన్ తే - అనే అన్నామ్‌దేశీయుడు అమెరికా వ్యాపారస్థుల ధనసాయంతో ఫ్రెంచి ప్రతికూలమైన కొన్ని కరపత్రాలను ముద్రింపించి లండన్లో పంచిపెడుతున్నాడని "పారిస్ మాటిన్" అనే పారిస్‌పత్రిక ప్రకటించింది. "ఆర్థికవిషయాలలో ఫ్రెంచివారికంటె అన్నామ్ గారికే తేలిగ్గా వశంచేసుకోవచ్చు"నని కనిపెట్టి కొందరు అమెరికన్ వ్యాపారస్థులు లోగడ చెప్పినపనికై బియన్‌తేకు 10,000 పౌన్లు ముట్టజెప్పారని ఆపత్రిక వ్రాసింది. అరెస్టుకాబడినవారి కేసులు సైనికకోర్టువారు విచారిస్తారు. విదేశాలలో ఉన్న ఫ్రెంచిరాజ్యాల భద్రతాభంగానికై ప్రయత్నించారనే నేరం వీరిపైన మోపబడింది.

## జావామధ్య దక్షిణ ప్రాంతాలు

### జాతీయవాదుల స్వాతంత్ర్య సమరం

బటేవియా, అక్టోబర్ 10: ఇండొనీషియా జాతీయవాదులు జపానువారిని తొలగించి అధికారం హస్తగతం చేసుకుంటున్నారనీ, జపానువారి ఆయుధాలూ మందుగుండు సామానూ స్వవశం చేసుకుంటున్నారనీ జావా మధ్య దక్షిణప్రాంతాలనుంచివచ్చిన వార్తలన్నీ ఏకగ్రీవంగా తెలియజేస్తున్నై.

బటేవియాలో చాలవరకు నిశ్శబ్దంగా వుంది, అక్కడక్కడ లూటీలు మాత్రం జరుగుతున్నై. నగరంలో ఉంటున్న చైనా ప్రజ విప్లవం ప్రారంభమవు వచ్చునని భయపడుతున్నారు.

# "సైనిక, సామ్రాజ్య వాదాలను జపాను ఇక కట్టిపెట్టడం అవసరం"

## పండిట్ జవహర్లాల్ నెహ్రూ హితబోధ

### "చైనా, జపానుల సహకారంపైనే దూరప్రాచ్య శాంతి ఆధారపడి వుంటుంది"

అలహాబాదు, అక్టోబరు 10: "ప్రపంచ క్షేమాన్నీ, సంకుచిత జాతీయ ప్రయోజనాన్ని గమనించి, జపాను అన్యరాజ్యాలను జయించి సామ్రాజ్యాన్ని విస్తరించుకోవాలనే కాంక్షిస్తూ ఆ పాత కలలను కట్టిపెట్టడం అవసరం. కేవలం పగసాధించాలనే ధోరణిలో జపానువారు ప్రవర్తించకూడదు. ద్వేషభావంతో పగసాధించాలనే పూనుకుంటే, ఇక దానికి అంతు అనేదిలేదు. జపానువారు అసాధారణ లక్షణాలనూ, ప్రజ్ఞనూ కనబరిచారు; ఐతే, అవన్నీ తప్పుదారిలో నడచినవి. సక్రమమైన నూతన పునాదిపై జాతిని నిర్మించుకోడానికి జపానువారు తమ ప్రజ్ఞనూ అసాధారణ లక్షణాలను ఉపయోగించుకోవాలి. సైనికవాదాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ తోసివేసి జపానును స్వతంత్ర ప్రజాస్వామ్య సంస్థల దేశంగా మార్చివేయాలి. అట్టి జపాను ఇతరులను బెదరించడం గాని, దానిని చూసి ఇతరులు భయపడడంగాని 'జరగదు,'" అని పండిట్ జవహర్లాల్ నెహ్రూ జపానుకు సలహా ఇస్తున్నాడు. మిత్రరాజ్యాల గౌరవానికీ, విశ్వాసానికీ జపాను పాత్రం కావాలంటే మీ సలహా ఏమిటని జపాను వారు నెహ్రూను అడిగారు; అందుకు నెహ్రూ తన సమాధానంలో ఇలాకూడా తెలియజేశాడు:

"మిత్రరాజ్యాల గౌరవాన్ని, విశ్వాసాన్ని సంపాదించడానికి జపాను ఏమి చేయడం అవసరమని, మీ ఉద్దేశమో దాపరికం లేకుండా సలహా ఇవ్వవలసిందని కొన్ని జపాన్ వార్తా పత్రికలు నన్ను కోరినవి. ఇది నాకు అంతసులువైన పని కాదు. అన్యదేశ ప్రభుత్వాలకు, ప్రజలకు సలహా ఇవ్వడం కష్టసాధ్యమైన విషయం. పైగా ఇలా సలహా ఇవ్వడం అహంభావమనిపించు కుంటుంది కూడా. యుద్ధంలో ఓడి, దెబ్బతిని దౌర్భాగ్య స్థితిలో పడిపోయిన ఒకదేశ ప్రజలకు ఈ విషయమై సలహా ఇవ్వడం మరీ కష్టసాధ్యమైన విషయం. ఓటమికి, దౌర్భాగ్య స్థితికి వారెంతగా అర్హులైనప్పటికీ సలహా ఇవ్వడం కష్టమైనపనే. ఇంతేగాక మిత్రరాజ్యాలన్నిటి తరఫునగాని, మిగతా రాజ్యాలన్నిటికీ సలహా ఇస్తున్న నాల్గు అగ్రరాజ్యాల తరఫునగాని నేను మాట్లాడలేను. ఐతే కొంతవరకు భారతదేశములో వైఖరీ, అంతకంటే తక్కువగా, ఆసియాఖండమునో వైఖరి తెలుసునను కుంటున్నాను కాబట్టి ఒక భారతీయుడుగా నేను కొన్ని మాటలు మాత్రం చెప్పగలను.

ఒకప్పుడు జపానువారంటే భారతీయులు అభిమానించి వారి ఘనకార్యాలను శ్లాఘించారు. ఇలాంటి జపానువారు ఆసియాఖండ ప్రజల స్వాతంత్ర్యానికి పాటుబడడానికి పదులుగా పాశ్చాత్య రాజ్యాల సామ్రాజ్యవాదాన్ని దురాక్రమణ పద్ధతినీ అనుసరించడం ప్రారంభించారు. సామ్రాజ్యాన్ని విస్తరింపజేసుకొని అధికార ప్రాబల్యాన్ని స్థాపించుకోవాలనే దృష్టితో ఆసియాఖండ రాజ్యాలను జయించింది. కొరియా తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది. నూత్న స్వాతంత్ర్య స్థాపనకై పరిశ్రమిస్తున్న చైనాపై ఎడతెరిపి లేకుండా ఒత్తిడిచేసి, అదిరించీ, బెదిరించీ, చివరకు జపానువారు యుద్ధానికే దిగారు. ఈ సంఘటనలన్నిటివల్లనూ, జపాను ఎడల భారతీయుల వైఖరి మారిపోయింది. ఒకనాటి మెచ్చుకోలు స్థానంలో అసహ్యం బయలుదేరింది. భారతీయులు చైనా ఎడలనూ, జపాను ఎదిరించిన మిగతా రాజ్యాల ఎడలనూ సానుభూతి చూపసాగారు.

సామ్రాజ్యకాంక్షతో సాగించిన సాహస కృత్యాలతో జపానుకు విపద్దశ ప్రాప్తించింది. ఈనాడు ప్రపంచాధిపత్యానికి పాకులాడుతున్న ప్రతి దేశానికి పర్యవసానంగా ఇట్టి దుర్దశే సంప్రాప్తమవుతుంది.

ప్రపంచ క్షేమాన్నీ, సంకుచిత జాతీయ క్షేమాన్నీ అభిలషించి, జపాను తన విజయ కాంక్షను, దురాక్రమణ వాంఛను, పాత కలలను ఇక కట్టిపెట్టాలి. పగ సాధించే వైఖరిని జపాను అవలంబించకూడదు. విద్వేషానికీ, పగసాధింపుకూ పూనుకున్నట్లయితే, దానికి అంతు అంటూ ఏమీ వుండదు. జపానువారు అసాధారణ లక్షణాలను కనబరిచారు. ఐతే వారు వాటిని తప్పుదారిలో ఉపయోగించారు. ఈ అసాధారణ ప్రజ్ఞా విశేషాలను ఇక జపానువారు సుస్థిర పునాదులపై నవ్యపంథాలో జాతిని నిర్మించుకోడానికి వినియోగించుకోవడం అవసరం. సైనికవాదాన్నీ, సామ్రాజ్యవాదాన్నీ వారు కట్టిపెట్టాలి. జపానును స్వతంత్ర ప్రజాస్వామ్యస్థల రాజ్యంగా మార్చివేసుకోవాలి. అప్పుడు అది ఇతర రాజ్యాలను బెదిరించడానికిగాని, దాన్ని చూసి ఇతరులు భయపడడానికిగాని అవకాశంపుండదు. సమానత్వం అనే ప్రాతిపదికపై జపాను వారు తమ ఆర్థికవ్యవస్థను ఏర్పాటు చేసుకోవాలి. తమ ప్రజలందరికీ సమానావకాశాలు లభ్యమయేటట్లు చేయాలన్నదే మూలసూత్రంగా వుండాలి.

యే ఇతరదేశంపైనా ఆర్థికాధికారాన్ని చలాయించడానికి పూనుకోకూడదు. ఈ విధంగా జపానువారు ఐశ్వర్యప్రదమయిన, ప్రగతిమార్గాన నడిచే జపానును, ఇరుగు పొరుగు దేశాలతో స్నేహసంబంధాలు గల జపానును, ఆసియాఖండ రాజ్యకుటుంబంలోను, ప్రపంచ సోదరరాజ్యకూటములోను సభ్యత్వంగల నూత్న దేశంగా తయారు చేసుకోడానికి వీలవుతుంది. ఆర్థికంగానూ, ఆధ్యాత్మికంగానూ చైనాపై జపాను తీవ్రంగా దెబ్బతీసింది. అందువల్ల చైనా ప్రజల సౌజన్య, సుహృద్భావాలను సముపార్జించడమే జపాను ముఖ్యకర్తవ్యంగా పెట్టుకోవాలి.

చైనా, జపాన్ ప్రజల సహకారంపైనే దూరప్రాచ్య శాంతిఆధారపడి వుంటుంది. ఇట్టిశాంతికి స్వాతంత్ర్యమే మూలాధారం. జపాను ఈ విధానాన్ని అవలంబించినట్లయితే తనకు యుద్ధంలో తగిలిన తీవ్రమైన గాయాలన్ని మానిపోవడమేగాక తనకేగాక తదితర దేశాలకూ మానసికంగా తగిలిన దెబ్బలను సైతం నయంచేసుకోడానికి వీలవుతుంది. అప్పుడు మిగతా దేశాలకూ జపానుకు మధ్య ఏర్పడిన విభేదం తొలగిపోవడానికి వీలుంటుంది. అప్పుడు భారతదేశం, ఆసియాఖండంలోని మిగతారాజ్యాలు జపానుపై తమకున్న పాత ఆగ్రహాన్ని అసహ్యాన్ని విస్మరించగలవు; ఆసియాఖండ స్వాతంత్ర్య విషయంలోనూ, విశాల ప్రపంచ శాంతి వ్యవస్థలోనూ, మిగతా దేశాలన్ని జపానుతో సహకారం చేయగలవు."

శాన్ ఫ్రాన్సిస్కో, అక్టోబర్ 10:- డచ్ వార్తాసంస్థ ఆనటా ఈ వార్త పంపింది:

జావాలో అనేకచోట్ల విస్తృతంగా అల్లకల్లోలాలు జరుగుతున్నవి. డచ్‌వారి ఇళ్లను లూటీ చెయ్యటం, డచ్ ఉద్యోగులను తుపాకులతో చాటుమాటుగా కాల్చడం, మొదలైనవి జరుగుతున్నవి. జాతీయవాదులలో కొందరు అతివాదులు మధ్యస్థంగాఉంటే ఇండొనేషియన్ ఉద్యోగులనుపట్టి నిర్బంధంలో ఉంచుతున్నారు.

బటేవియాలో తప్ప మిగిలిన అన్ని చోట్లా ఈ అల్లరులవలన మిత్రసైనికులకు ఆహార సరఫరా మొదలైన ఉపచార కార్యాలన్నీ స్తంభించి పోవలసి వచ్చింది.

## ఇండోనేషియా స్వాతంత్ర్య పోరాటము

### స్టూడెంట్సు కాంగ్రెసువారి ప్రకటనము

ఆల్ ఇండియా స్టూడెంట్సు కాంగ్రెసువారు అక్టోబరు 15 వ తేదీ "ఆసియాఖండ ఉత్సవదినము" (యూరపియనులు ఆసియాఖండము వదిలిపెట్టిపోవలసిన దినముగా) భావించి ఉత్సవముల దేశమంతటా చేయవలెనని ప్రకటించినారు.

ఇండోనేషియాలోనూ ఆసియాఖండము యితర ప్రాంతాలలోనూ స్వాతంత్ర్యముకోసము జరుగుతున్న పోరాటాలను గురించి ప్రజాప్రబోధము కలిగించవలెనని స్టూడెంట్సుకాంగ్రెసువారి అభిప్రాయము.

ఊరేగింపు ఉత్సవము ప్రశాంతముగా సాగించి సభలుచేసి ప్రజలకు ఇండొనేషియా పోరాటాన్ని గురించి తెలియచెప్పవలెనని స్టూడెంట్సు కాంగ్రెసువారు ప్రకటించినారు.

## నాగపూరు ఎన్నికల ప్రచారం

నాగపూరు, అక్టోబరు 10: నీరారు కాంగ్రెసు నాయకుడు వీరవాబురావు జోషి యిక్కడి బహిరంగసభలో ఉపన్యసిస్తూ "కాంగ్రెసుకు ఏయితరపక్షముతోనూ తగాదాకాని విరోధముకాని లేదు. బ్రిటిషు ఇంపీరియలిజమును నిర్మూలనము చేయడానికి కాంగ్రెసు పూనుకొన్నది. ఈ విషయములో ప్రజలందరూ ఏకాభిప్రాయులుగా ఉన్నారు. ఈసారి ఎన్నికలలో కాంగ్రెసుకు అఖండవిజయము కలుగగలదు. నాగపూరులో కాంగ్రెసు భవనము నిర్మింపవలెను." అని వాయునావావు ప్రసంగించినాడు.

## సైనికులకు ఓటింగు సౌకర్యము లొసంగవలెను

### ప్రభుత్వమునకు నెహ్రూ పండితుని హెచ్చరిక

అలహాబాదు, అక్టోబరు 10: వోటు చేయుటకును, ఎన్నికల సభలకు హాజరగుటకును సైనికులకు అన్ని సౌకర్యములూ యివ్వవలెనని కోరుచు పండిత జవహర్లాల్ నెహ్రూగారు ఈ క్రింది ప్రకటన గావించుచున్నారు: రాబోవు ఎన్నికలలో వోటు చేయుటకు తమకు సౌకర్యము లివ్వుట లేదని సైన్యములో పనిచేయుచున్న వారి నుండియు, మిత్రమండలి డిఫెన్సు సర్వీసులకు జెందిన వారినుండియు కొంతకాలము నుండి నాకు ఫిర్యాదులందు వచ్చుచున్నవి. ఇట్టి సౌకర్యము లొసంగబడునని కొంతకాలము క్రిందట రాజప్రతినిధి వాగ్దానము గావించినట్లు తెలియుచున్నది. ఐనప్పటికి ఫిర్యాదులు ఇంకను వచ్చుచున్నవి. వోటర్లుగా చేరుటకు, స్వేచ్ఛగా ప్రచారముచేయుటకు, రాజకీయపక్షములతో సంబంధము పెట్టుకొనుటకు వోట్లు చేయుటకు బ్రిటిషుసేనలో పనిచేయుచుండినవారి కట్టి సౌకర్యము లొసంగబడెనో అట్టిసౌకర్యములనే భారతదేశములోను, ఖండాంతరములలోను పని చేయు తమకుగూడ యివ్వవలెనని సేనలో పనిచేయువారు కోరుచున్నారు. వోటర్ల పట్టికలలో తమపేర్లుచేర్చవలెనని తాముగావించిన విజ్ఞాపనములను సైనికాధికారులు నిర్లక్ష్యభావముతో చూచుచున్నారని వారు ఫిర్యాదు చేయుచున్నారు, వారి కోర్కెను కాంగ్రెస్ సంపూర్ణముగా సమర్థించుచున్నది. సేన, నౌకాదళము, విమానదళములయందలి మన జనమునకు పౌరసత్వ హక్కు లేకుండ చేయుట అక్రమము, అన్యాయము. యుద్ధరంగములో వారు చూపిన ధైర్యసాహసములను సామర్థ్యమును పేనోళ్ల పొగిడియున్నారు. వారి కేదో యేర్పాటు చేయవలెనని చెప్పియున్నారు. ఇంత చెప్పి వారికి వోటింగు హక్కు లేకుండచేయుట వింతగానున్నది. ఇందు విషయమున రాజప్రతినిధి గావించిన వాగ్దానము సంపూర్ణముగా అమలుపరుపబడునని, వోటుచేయుటకు, ఎన్నికల సభలకు హాజరగుటకు సేనలో పనిచేయుచున్న మనవారికి అన్ని సౌకర్యములు కలుగజేయుదురని విశ్వసించుచున్నాను.

(యు. ప్రె.)

## పండిత గోవిందవల్లభపంతు

### యు. పి. ఎన్నికల ప్రచారము

లక్నో, అక్టోబరు 10: రానున్న ఎన్నికల ప్రచారము కోసము పండిత గోవిందవల్లభ పంతు లక్నోనుంచి బరేలికి వెళ్లుతున్నాడు. ఆయన ఈ విధముగా చెప్పినాడు. "ఎన్నికలలో కాంగ్రెసుకే అందరు ఓట్లు యివ్వవలసిందని కోరుతున్నాను. ఈ రాష్ట్రములో ప్రజలందరున్నూ కాంగ్రెసు పక్షానే ఉన్నారనిన్నీ కాంగ్రెసు అభ్యర్థులే ఎన్నికలలో వస్తారనీ నమ్ముతున్నాను. అయినప్పటికిన్నీ కనిపెట్టిఉండవలసిన మందినన్నిని అతిధైర్యము ఒకప్పుడు ప్రమాద హేతువు కావచ్చునని అనుకొంటున్నాను. ఇంగ్లీషువారు ఇండియాను వదిలిపెట్టి పోవలెను అనే కాంగ్రెసు తీర్మానమున్నూ సత్వర సంపూర్ణస్వాతంత్ర్య సంప్రాప్తిని సూచించిన ప్రచారమున్నూ కావలసిఉంది."

## మధురలో లాలాశంకరలాల్

మధుర, అక్టోబరు 10: ఆల్ ఇండియా ఫార్వర్డుబ్లాకు మాజీ కార్యదర్శి లాలా శంకరలాల్ ఇక్కడి బహిరంగసభలో ఉపన్యసిస్తూ 1942 వ సంవత్సరములో మద్రాసు రాజధానిలో ప్రజలు అత్యంత ధైర్యముతోనూ సాహసముతోనూ ఉద్యమము సాగించినందుకు మెచ్చుకొంటూ ఫార్వర్డుబ్లాకువారు చెప్పినట్లుగా స్వాతంత్ర్యపోరాటానికి దేశము సన్నద్ధముగా ఉందన్నసంగతి రుజువుచేసింది. కొన్ని సందర్భాలలో కాంగ్రెసువారే యీ పోరాటములో వెనుకంజవేసినారు. 1857 న సంవత్సరము తరువాత ఇంతటిపోరాటము యెన్నడూ జరగలేదు.

శాసనసభలలోకి పోయినంతమాత్రాన స్వాతంత్ర్యము రాజాలదు. ప్రజాభిప్రాయము ఇండియాలో నెలకొల్పవలసిన అగత్యాన్ని రుజువుచేయడానికే రానున్న ఎన్నికలలో కాంగ్రెసువారు పాల్గొనవలసినారు. జాతీయస్వాతంత్ర్యముకోసము బాధపడుతూ పోరాడుతున్న కాంగ్రెసు వారికే అందరూ ఓట్లనివ్వవలసిందని" చెప్పినారు.

లక్నో అక్టోబరు 10: యు. పి. పార్లమెంటరీ బోర్డు సభ్యులు పండిత గోవిందవల్లభ పంతు, రఫీ అహమ్మద్ కిద్వాయి ఆచార్య నరేంద్రదేవు, సంపూర్ణానంద, శ్రీకృష్ణదత్త పాలీవాల్ యీరోజున తిరిగి సమావేశమయినారు. సెంట్రల్ ఎసెంబ్లీకి యు. పి. తరఫున అభ్యర్థుల పట్టిని ఏర్పాటుచేసి ఆ అభ్యర్థుల పట్టిని అంగీకరించడానికి సెంట్రల్ పార్లమెంటరీ బోర్డువారికి పంపించినారు.

## శ్రీ పురుషోత్తందాస్ త్రికందాస్ విడుదల

### బొంబాయి న్యాయమూర్తుల నిర్ణయం

బొంబాయి, అక్టోబరు 10: బొంబాయి కాంగ్రెస్ సోషలిస్టుపార్టీకి చెందిన శ్రీ పురుషోత్తందాస్ త్రికందాస్ బొంబాయి హైకోర్టులో దాఖలుచేసిన హెబియస్ కార్పస్ దరఖాస్తును న్యాయమూర్తులు సేన్, గజేంద్రగడ్కర్ ఇద్దరూ విచారించి, శ్రీ త్రికందాస్‌ను వదలిపెట్టేశారు.

లాయర్లతోనూ, బొంబాయికాంగ్రెస్ ప్రముఖులతోనూ కోర్టు కిటకిట లాడిపోయింది.

శ్రీ త్రికందాస్ తరఫున శ్రీ కె. ఎం. మున్షీ వాదించాడు. దరఖాస్తుదారుపై డిటెన్షను ఉత్తరువు 1942 డిసెంబర్ 22 న జారీ అయిందనీ 1943 అక్టోబరు 19 న జారీఅయిన మరిఒక ఉత్తరువువల్ల మొదటి ఉత్తరువు రద్దుఅయిపోయిందనీ 1944 జనవరి 12 న రెస్ట్రిక్షన్ అండ్ డిటెన్షన్ ఆర్డినెన్సు ప్రకారం డిటెన్షన్‌ను పొడిగిస్తూ దరఖాస్తుదారుపై ఉత్తరువు జారీ చేశారనీ వివరించి మొదటి ఉత్తరువుకు కాలదోషం పట్టడంవల్ల దరిమిలాను జారీ అయిన ఉత్తరువులు అశాస్త్రీయాలని శ్రీ మున్షీ వాదించాడు.

అసలు డిటెన్షను ఉత్తరువుకు కాలదోషం పట్టినా, పైన పేర్కొన్న ఆర్డినెన్సు ప్రకారం 6 మాసాల అనంతరం ప్రభుత్వము దానిని మళ్లీ అమలు చేయవచ్చునని అడ్వకేట్ జనరలు వాదించాడు.

న్యాయమూర్తులు దరఖాస్తుదారు వాదమే సరియైనదని శ్రీ పురుషోత్తమదాస్ త్రికందాస్‌ను వదలివేయవలసిందని ఆజ్ఞాపించారు.

## త్రికందాస్ అరెస్టు వివరాలు

శ్రీ పురుషోత్తందాస్ త్రికందాస్ 1942 నవంబర్ 19 న బొంబాయి పరిసరాలలోని చాంద్రాలో అరెస్టయాడు. అంతకుముందు 4 నెలలనుంచీ అక్కడే అజ్ఞాతవాసం చేశాడు.

'క్విట్ ఇండియా' తీర్మానం జరిగి, నాయకులు అరెస్టు కావడంతో చెలరేగిన గందరగోళంలో పాల్గొంటున్నాడని ఆయనమీద ఆరోపించారు. ఆయనజాడలు కనుక్కోవడానికి బొంబాయిపోలీసువారు 1942 ఆగస్టు 8 నుంచీ ప్రయత్నించారు. చీఫ్ ప్రెసిడెన్సీ మాజిస్ట్రేటు చేసిన ప్రకటన ప్రకారం ఆయనవచ్చి లొంగకపోవడంతో బొంబాయి ప్రభుత్వం ఆయన ఆస్తిపాస్తులను జప్తుచేసింది. దరిమిలాను బొంబాయిలోని ఒక స్నేహితుని ఇంట్లో ఉండగా పోలీసులు ఆయనను అరెస్టుచేశారు. అరెస్టు జరిగిననాటికి ఆయన గడ్డం బాగా పెంచాడు.

బొంబాయి రాష్ట్రీ కాంగ్రెస్ కమిటీ వారు సాయంత్రం కాంగ్రెస్ భవనంలో శ్రీ త్రికందాస్‌కు లాంఛన ప్రాయంగా స్వాగతమిచ్చారు.

## స్థానిక సంస్థలపై జండాలు

### ఏ పార్టీవి ఉండరాదు

మదరాసు, అక్టోబర్ 11: స్థానిక సంస్థల కార్పొరేషనుతో సహా, భవనములపై ఇండియను "నేషనలు" కాంగ్రెసు పతాకము ఎగురవేయరాదని ప్రభుత్వంవారు 1943 జనవరి, ఫిబ్రవరి మాసములందు ఉత్తరువు చేసియుండిరి. ఆవిషయమై విచారింపగ, ఏ ఒక పార్టీయొక్క పతాకమును స్థానికసంస్థలు ఎగురవేయకూడదని తలంచిరి. కనుక, పై ఉత్తరువులను సవరించుచు ఏ పార్టీయొక్క పతాకమును స్థానికసంస్థలు మునిసిపాలిటీలు, కార్పొరేషను ఉపయోగించుచున్న భవనాలపై ఎగురవేయరాదని ఉత్తరువు వెలిసె.

స్థానిక సంస్థల భవనములందు నిర్బంధమునందున వారి పటములు విగ్రహాలు స్థాపించరాదని 1944 జూను, ఆగస్టు మాసములందు జారీచేసిన ఉత్తరవును యిపుడు ప్రభుత్వంవారు రద్దుచేసిరి.

## మలయా

(1 వ పేజీ తరువాయి)

తగినంత కాలం అక్కడ నివసించినవారికి ఆ పౌరస్వత్వం ఉంటుంది. వారిందరికీ 'పౌరుడు' అనబడేవాని కుండే సమస్త హక్కులూ, బాధ్యతలూ ఉంటాయి. ఎవ్వరూ కూడా ప్రత్యేక హక్కులనిమీద ఆధార పడడానికి వీలులేదు. ఇంటి సంపాయించుకు పోవడానికి ఆదేశాన్ని ఉపయోగించుకోరాదు.

### పరిశ్రమలవల్ల లాభం దేశీయులకే

మలయాలో వ్యవసాయక, ఖనిజోత్పత్తుల పరిశోధనలద్వారా, పరిశ్రమల ద్వారా వృద్ధి కావడం ఆ దేశానికే కాక, ప్రపంచానికి లాభం. అయితే ఆ పరిశ్రమలవల్ల కలిగే ఫలితాన్ని పూర్తిగా అనుభవించే అవకాశం దేశీయుల కుంటుందని హామీ ఉండాలి. దేశ సౌభాగ్యం ప్రజల జీవన ప్రమాణంలో ప్రతిబింబించాలి.

# రాష్ట్ర వార్తలు

## అమలాపురం

ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుసంఘ ప్రధాన కార్యదర్శి కళా వేంకటరావుగారి అధ్యక్షతను విద్యార్థి కాంగ్రెస్‌సభ గత 28 న జరిగింది. వేంకటరావుగారు విద్యార్థి కాంగ్రెసుసంస్థ అభివృద్ధినికోరారు. కమిటీ ఏర్పడింది.

## చోడవరం

భూపతిరాజు సత్యనారాయణ రాజు గారి అధ్యక్షతను బోర్డు హైస్కూలు విద్యార్థుల సమావేశం గత 25 న జరిగింది. త్రిపురాన హరిహరరావు, పున్నయ్యగార్లు విద్యార్థి సంఘాల ఆవశ్యకాన్ని గూర్చి మాట్లాడారు.

## కొవ్వూరు

కేశిరాజు వెంకటప్పారావుగారి అధ్యక్షతను స్థానిక విద్యార్థి కాంగ్రెసు మహాసభ జరిగింది. జటావల్లభుల పురుషోత్తం విజయభాస్కరరావు, రామలింగరాజు, పరాసేని విశ్వేశ్వరరావుగారలు మున్నగువారు మాట్లాడారు.

## మదనపల్లి

శ్రీమతి చంద్రా రాయల్ గారి అధ్యక్షతను మహిళాసంఘ వార్షికోత్సవం జరిగింది. కె. సుందరాబాయిగారు స్వాగతం చెప్పారు. ఆర్. సుశీలాబాయిగారు నివేదికను సమర్పించారు. అధ్యక్షత వహించినవారు, స్త్రీజాతియందు సంఘైక్యలేక మతవమూ రాజకీయాలూ సాంఘిక మర్యాదలూ అడ్డురాకూడదు. స్త్రీవిద్యావ్యాప్తికై ప్రతి ఇల్లాలూ శ్రద్ధవహించాలి అని చెప్పారు. నృత్త, గీత, నాటకప్రదర్శనం జరిగింది.

## తెనాలి

బండారు వెంకటేశ్వర్లుగారి అధ్యక్షతను స్థానిక కళావంతుల యువజనసంఘ కార్యవర్గ సమావేశం జరిగింది. కాకినాడలోని వివిధ సంస్థలవారు భోగం మేళాలను బహిష్కరించినందుకు సభవారు వారిని అభినందించారు. సంస్కరణ ప్రచారంలో కొంతమంది రౌడీలు మున్నగువారు వారిని కొట్టినందుకు వారి చర్యను నిరసించారు. అధికారం లేకుండా రౌడీలకు సహాయపడిన పోలీసువారిపై తగిన చర్య తీసుకోవాలనిఅధికారులనుకోరారు.

## అనంతపురం

అనంతపురం మ్యునిసిపల్ స్పెషల్ ఆఫీసరు పరిపాలనను న్నలోపాలను తెలిపి వాటిని చక్కబెట్టవలెనని కోరుటకు పి. లక్ష్మీకాంత రావు, బి రంగనాథం, బి. యస్. కృష్ణమూర్తి, కొండప్ప, రామాచార్యులు, వాసుదేవరావు మున్నగువారు లోకల్ బోర్డుల డెప్యుటీ ఇన్‌స్పెక్టరువద్దకుపోయి మాట్లాడారు. చెప్పిన దానిలకించి విచారిస్తానని ఇన్‌స్పెక్టరు చెప్పాడు.

## పునాదిపాడు

కోనేరు జనార్దనరావుగారి అధ్యక్షతను స్థానిక విద్యార్థి కాంగ్రెసు ప్రచారకులు గత 29 న సమావేశమైనారు. ఎస్. ఎస్. ఎల్. సి. చదువుతూన్న ప్రతివిద్యార్థిని, విద్యార్థులకు ప్రోటుహక్కు ఉండాలి అని తీర్మానించారు. బొంబయిలోని హిందూ-ముస్లిం కొట్లాటకు కారణం కాంగ్రెసేనని బ్రిటన్‌లోని పత్రికల ప్రచారానికి సభవారు పూర్తిగా వ్యతిరేకించారు.

## విజయనగరం

నూతన కార్యవర్గపు ఎన్నికల నిమిత్తం స్థానిక అభ్యుదయ రచయితల సంఘ సమావేశము కస్తూర్బా పఠనమందిరములో నిడుదవోలు లింగమూర్తిగారి అధ్యక్షతన సెప్టెంబరు 3 వ వారంలో జరిగినది. ఆయిల సోమయాజులు నరసింహశర్మగారు కార్యదర్శిగా ఎన్నుకోబడినారు.

అంతకు పూర్వం నిడుదవోలు లింగమూర్తిగారి అధ్యక్షతన అభ్యుదయ రచయితల సంఘ ఆధ్వర్యన జరిపిన సభలో "ప్రస్తుతం రచయితలు శృంగారం కథావస్తువుగా ఉంచుకం విరమించి ప్రజాబాహుళ్యానికి పనికివచ్చేరచనలు చేయాలి, అలా చేస్తే భావి భాగ్యోదయ కారకులౌతారని మోహన్ మిశ్రాగారు ఉపన్యసించారు.

## నెల్లూరు

మ్యునిసిపల్ కౌన్సిలు సమావేశం వైస్ చైర్మన్ గారి అధ్యక్షతను గత 28 న జరిగింది. 1-4-44 అర్ధసంవత్సరానికి, 1-10-44 అర్ధసంవత్సరానికి, 1-4-45 అర్ధసంవత్సరానికి రివిజన్ పన్ను విధించటానికి కమీషనరు ఎస్. కృష్ణయ్యశెట్టిగారు కౌన్సిలును పర్మిషన్ కోరారు. దీనిమీద చర్చజరిగింది. 1-4-44 అర్ధసంవత్సరానికి కమీషనరు వేయనున్న పన్ను రద్దుచేయాలిసిందిగా ఎ. ఎస్. నరసింహారావుగారు ఉపపాదించిన తీర్మానం నెగ్గింది. 1-10-44 1-4-45 అర్ధసంవత్సరాలకు వేయవలసిన పన్నును పరిశీలించటానికి ఎం. ఎస్. నరసింహారావుగారు మున్నగువారు కల ఉపసంఘాన్ని నియమించటానికి తీర్మానించారు.

## తాడేపల్లిగూడెం

ఈ ప్రాంతాలలో వరికి ఎర్రతెగులు కోడితెగులు తగిలి పోతున్నవి. అనుకూల వాయువులు ఇంకా వీచటంలేదు.

## చిత్తూరు

నెల్లూరునుంచి సప్లయి అవుతున్న రేషన్ బియ్యం అధ్వాన్నంగా ఉంటున్నది. కడుపులో మంట, అతిసారం, వాంతులతో ప్రజలు బాధపడుతున్నారు.

## కాకినాడ

శ్రీపాద రామయ్యగారి అధ్యక్షతన 26 న జరిగిన కాకినాడ నూలు బట్టల వర్తకుల సంఘ సమావేశంలో చిట్టూరి సూరయ్యగారిని కార్యదర్శిగా ఎన్నుకున్నారు

## గుడివాడ (?)

పోటుమూరు గ్రామంలోని వీరాంజనేయ మైకాగనిలో సెప్టెంబరు 25 న తోటా పగిలి ముగ్గురికి దెబ్బలుతగిలినవి. వీరిని సర్కారు ఆసుపత్రికి చేర్చారు.

## నందిగామ

తాలూకా కాంగ్రెసు కార్యవర్గ సమావేశం వాసిరెడ్డి దుర్గా ప్రసాద్ (ఎం.ఎల్.ఏ.) గారి అధ్యక్షతను సెప్టెంబరు 25 న జరిగింది. రానున్న శాసనసభ ఎన్నికలలో వోటర్లను ఎక్కువ మందిని చేర్పించటానికి ప్రయత్నించాలి అని తీర్మానించారు: పొగాకు పన్ను, రైతులకు నష్టదాయకం ఐనందున వెంటనే ఆపన్ను తీసివేయాలని కేంద్ర ప్రభుత్వాన్ని కోరారు.

## జగన్నాథపురం

గ్రామ చేనేతవారు పిచ్చిక సూరన్నగారి అధ్యక్షతను గత 25 న సభచేశారు. కాశిన శంకరయ్యగారు మాట్లాడారు. చిరకాలం నుంచీ ఇదే వృత్తిని జీవయాత్ర సాగించేవారికి కొత్తకోటాలకు నూలు ఇవ్వవలసిందిగా జిల్లా సంఘం ద్వారా రాష్ట్ర కమీషనును కోరారు.

## బెల్లంవారి పాలెం

రేపల్లె తాలూకా బెల్లంవారి పాలెంలో గత 27 న కర్రి వెంకట చలమయ్యగారి అధ్యక్షతను సభ జరిగింది. కాంగ్రెసు-రానున్న ఎన్నికలను గూర్చి చావలి బాల సుందరంగారు, గాంధీతత్వమును గూర్చి కాండూరి సూరిశాస్త్రిగార్లు ఉపన్యసించారు.

## మామిళ్లపల్లి

చేనేత పారిశ్రామిక సంఘమువారు మామిళ్లపల్లి హనుమంతరావుగారి అధ్యక్షతను ఈ 2 న సభచేశారు. కొసరాజు అమ్మయ్యగారు, జండా ఎగరవేశారు. ప్రగడ కోటయ్యగారు రానున్న ఎన్నికలలో కాంగ్రెసుకు అందరూ వోట్లను ఇచ్చి కాంగ్రెసును గెలిపించి ప్రజారాజ్యస్థాపనకు పూనుకోవాలని చెప్పారు.

## బరంపురం

వైశ్యరాజు కాశీవిశ్వనాథంగారి అధ్యక్షతను గత 30 న పౌరసభ జరిగింది. ఓఢ్రులు ఆంధ్రులయెడల చూపే వైఖరి ఖండింపబడింది. ఒరియా కమీషనర్‌ను తీసివేయాలని మ్యునిసిపల్ కౌన్సిలు చేసిన తీర్మానాన్ని ఖండిస్తూ, ఓఢ్రులుచేసిన సభలోని కేకలు, అల్లరి, జాతిద్వేషాన్ని కలిగిస్తాయనీ ఈ విషయమై ప్రభుత్వం తగినచర్య తీసుకొని విద్వేషకరమైన సభలూ ఉత్సవాలూ జరక్కుండా చూడాలనీ ప్రభుత్వాన్ని సభవారు కోరారు.

## బళ్లారి

నాట్యకళా విశారదులను టి. రాఘవాచారి, పట్టం శ్యామారావుగార్లు ఇక్కడ ఒక నాట్యకళా పరిషత్తును స్థాపించి యువకులకు తర్ఫీదు ఇవ్వాలని ఈ 4 న మ్యాక్ స్పోర్ట్స్ స్టేడియంలో జరిగిన అల్పాహారవిందు సందర్భంలో జిల్లాజడ్జి మ్యాక్ గారు సూచించారు. నెల్లూరునుంచి చంద్రశేఖరంగారు, వారి బృందం గౌరవార్థం ఈ విందు జరిగింది. రాఘవాచారి గారు సమావేశంలో ఉన్నారు.

## బెజవాడ

పోతిన గణపతి నృసింహుడు గారి అధ్యక్షతను గత 30 న హిందీప్రచార రజత జయంతిసమితి కార్యవర్గ సమావేశం జరిగింది. దేశభక్త కొండ వెంకటప్పయ్యగారు ఉపన్యసించారు. గాంధీజీకి దక్షిణదేశంపరఫున సమర్పింపబోయే నిధికిగాను 10 వేలు బెజవాడనుంచి వసూలుచెయ్యడానికి, నయా హిందూస్థానీపరీక్షకు 500 మంది విద్యార్థులను తయారుచెయ్యడానికి తీర్మానించారు.

కృష్ణామండల అర్చక సంఘంవారు డా॥ వి. ఎస్. ఆచార్యగారి అధ్యక్షతను సమావేశమైనారు. ఆగస్టు 28 న ఫోర్టు సెంట్ జార్జి గెజెట్‌లో ప్రకటితమైన హిందూ మతధర్మాదాయచట్ట సవరణ బిల్లును ఖండించారు. ఈబిల్లును ఎంత మాత్రమూ ఆమోదించరాదు. ప్రభుత్వం దీన్ని చట్టంగా చేయరాదు, అని ప్రజాభిప్రాయానికి ఇచ్చిన గడువును మరి రెండు నెలల వరకైనా పెంచాలని తీర్మానించారు.

## నందివెలుగు

[illegible] గారి అధ్యక్షతను గత 27 న కాంగ్రెసు మహాసభ జరిగింది. గంటా నాగయ్యనాయుడు, ఆకునూరి పోతురాజునాయుడుగార్లు అధ్యక్షకార్యదర్శులుగా కార్యవర్గం ఎన్నిక జరిగింది.

## కనమూరు

కొత్తపల్లి సంకటకృష్ణశర్మగారి అధ్యక్షతను ఈ 1 న హిందీప్రచార సప్తాహమహోత్సవం ప్రారంభం అయింది. ఆరెకపూడి రాఘవేంద్రరావు, చిట్టూరి లక్ష్మీనారాయణ శర్మగార్లు గాంధీజీ జీవితం నుంచి విద్యార్థులు నేర్చుకోవలసిన విషయాన్ని గూర్చి మాట్లాడారు.

## కర్నూలు

డివిజనల్ రూరల్ ఎకనామిక్‌బోర్డు సమావేశం కె. పి. కేలుయిరెడ్డిగారి అధ్యక్షతను గత 29 న జరిగింది. కర్నూలు తాలూకా గూడూరులో నవంబరులో వ్యవసాయ, పారిశ్రామిక, పశుప్రదర్శనాలు జరపడానికీ నందికొట్కూరు తాలూకాలో అలాగే జరపడానికీ తీర్మానించారు.

## బళ్లారి

జిల్లాబోర్డు సమావేశము డా॥ నాగనగౌడుగారి అధ్యక్షతను ఈ 24 న జరిగింది. "హైవేస్ డిపార్టుమెంటు శుద్ధ అనావశ్యకం అనీ, రహదారీ విధానాన్ని రానున్న ప్రజా ప్రభుత్వానికి వదిలివేయాలనీ తీర్మానించారు.

## పాలకొల్లు

పట్టణ చేనేత పారిశ్రామికసం సంఘ వార్షికోత్సవం పుత్సల సత్యనారాయణగారి అధ్యక్షతను జరిగింది. అల్లూరు సత్యనారాయణగారు సభను ప్రారంభించారు. కాకర్లపూడి కామేశ్వరరావు, కడుపు రాములుగార్లు మాట్లాడారు. అసెం వీరభద్రుడుగారిని అధ్యక్షులుగానూ, నడిమెట్ల గంగరాజుగారిని కార్యదర్శిగానూ కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

## హొసపేట

థియొసాఫికల్ లాడ్జి మైదానంలో యం. రాఘవేంద్రరావుగారి అధ్యక్షతను సభ జరిగింది. శ్రీ రంగనాథ దివాకర్, శ్రీ టేకూరు సుబ్రహ్మణ్యంగారలు 1942 తీర్మానాన్ని బలపరుస్తూ, రానున్న ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థులకే ఓట్లు ఇవ్వాలని ఉపన్యసించారు.

షుగర్‌కేన్ గ్రోయర్స్ కో-ఆపరేటివ్ మహాసభ ఈ 1 న జరిగింది. దాదాపు 4 సం. ల క్రితం స్పెషల్ కమిటీ పరిపాలనకు దీన్ని ఒప్పగించారు. ఆర్. నాగనగౌడు, సంగరాం, మల్లన్న, జంబప్ప, అల్లీసాబుగారలు డైరెక్టరులుగా ఎన్నుకోబడినారు.

## అనకాపల్లి

మ్యునిసిపాలిటీవారు నిర్మించనున్న పార్కుకు విశాఖ కలెక్టరు యస్. జోసెఫ్ రెడ్డిగారిచే సెప్టెంబరు 26 న శంకుస్థాపన కావింపబడింది.

శ్రీమతి వేమగంటి పాపాయమ్మగారు సెప్టెంబరు 26 న శారదా గ్రంథాలయ భవనంలో గృహనిర్వహణాన్ని గూర్చి మాట్లాడారు.

రేషన్ డిపార్టుమెంటువారు సుమారు రెండు నెలల నుంచీ ఉప్పుడు బియ్యాన్నే సప్లయిచేస్తున్నారు. జిల్లా కలెక్టరు ఇక్కడ మకాం చేసినప్పుడు, పౌరులు గ్రంథి కన్నయ్యసెంతులు గారి అధ్యక్షతను దర్శించి ప్రజల కష్టాలను నివేదించారు. పంచదార కొరతను గూర్చి చెప్పారు. చెప్పినదంతా సావధానంగా విని కలెక్టరు తగు ఏర్పాట్లు చేస్తామని చెప్పారు.

## గుడివాడ

తుమ్మల సీతారామ బ్రహ్మంగారి మరణవార్త ఈ 3 న తెలిసింది. డిస్ట్రిక్టు మునసబ్ కోర్టులో ఉప్పులూరు ఆదినారాయణ మూర్తిగారు రిఫరెన్సు చేశారు. కోర్టు వ్యవహారాలు 15 నిమిషాలు ఆపారు.

లాయర్ల సంఘం కలెడ్ల రామయ్యగారి అధ్యక్షతను ఈ 4 న జరిగింది. తుమ్మల సీతారామ బ్రహ్మంగారి మృతికి చింతిస్తూ తీర్మానించారు.

డిసెంబరులో ఇక్కడ జరిగే ఆంధ్ర నాటక కళా పరిషత్ సభలకు ఆహ్వాన సంఘంవారు శివ లెంక పున్నయ్యగారి అధ్యక్షతను గత 28 న సమావేశమైనారు. అడుసుమిల్లి వెంకట సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షులుగా, దుక్కిపాటి మధుసూదనరావు, పెద్యేటి వెంకటరావుగార్లు కార్యదర్శులుగా కార్యవర్గాన్ని ఎన్నుకొన్నారు.

అడుసుమిల్లి సుబ్రహ్మణ్యేశ్వరరావుగారి అధ్యక్షతను ఈ 1 న మ్యునిసిపల్ కౌన్సిలు సమావేశంజరిగింది. బేతవోలులో హయ్యరు ఎలిమెంటరీ స్కూలు మంజూరు చేయవలసిందని ఆ గ్రామస్థులు పోయిన నాగయ్య వద్దే వెంకటస్వామిగారలు కమీషనరుగారికి సమర్పించిన మహజరును విచారించారు. మంజూరు చేయటానికి తీర్మానిస్తూ త్వరలో ఆ పాఠశాలకు రికగ్నిషన్ ఇవ్వాలిసిందిగా విద్యాశాఖవారిని కోరారు.

## సత్తెనపల్లి

దాసరి వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతను సభ జరిగింది. చింతమనేని భావయ్య చౌదరి, అక్కల కోటయ్య, ఆకురాతి రంగనాయకులుగార్లు మాట్లాడారు. అధ్యక్షులు, రాబోయే ఎన్నికలలో కాంగ్రెసు నిలబెట్టిన వారికే ఓట్లు ఇవ్వాలనీ, అందరూ కాంగ్రెసును బలపరచాలనీ చెప్పారు.

## రామచంద్రపురం

తూ॥ గో॥ జిల్లా అర్చకసంఘమహాసభ గత 30 న యలమంచిల సుబ్రహ్మణ్యంగారి అధ్యక్షతను జరిగింది. మద్రాసు హిందూ మత ధర్మాదాయాల చట్టసవరణకు ప్రతిపాదింపబడిన బిల్లుపై పలువురు చర్చించారు. చిరకాల స్థాపితాలూ, న్యాయసమ్మతాలూ అయిన తమ హక్కులను న్యాయస్థాన విచారణావకాశం లేకుండా తొలగించటానికి, ప్రతిపాదింపబడిన సవరణలను ఆక్షేపిస్తూ తీర్మానించారు.

## మదరాసు రేడియో

### అక్టోబరు 13 శనివారం

(వి. యు. యం. 211 మీ.) ఉ॥ 8-30 సా॥ 7-15 టి. వి. కృష్ణన్. మ॥ 1-0; సా॥ 6-45 వి. సావిత్రిదేవి. మ॥ 3-0 రికార్డులు. సా॥ 5-30 యస్. సోమసుందరం. రా॥ 8-0 ఆ సమయంలో ప్రకటించే కార్యక్రమం. రా॥ 9-55 రికార్డులు.

మదరాసు 2. ఉ॥ 7-40; మ॥ 2-5; సా॥ 7-30 తెలుగులో వార్తలు. సా॥ 7-0 మతము లేని మంచితనం - టి. గోపీచంద్ చే తెలుగు ప్రసంగం. సా॥ 7-15 గ్రామీయులకై తెలుగులో ప్రసారం.

## తిరుచినాపల్లి రేడియో

సా॥ 5-0 వి. రాజారామఅయ్యర్ (వీడేలు) సా॥ 6-0; రా॥ 9-45 కే. వి. నటరాజన్. రా॥ 8-0 మదరాసులోవలె.రా.10-0 రికార్డులు.

## మదరాసు ధరలు

మదరాసు, అక్టోబరు 11:

వేరుసెనగ: (531 పౌ॥ బా॥ 1-కి ఎక్సు కోస్తా గిడ్డంగులు) క్రొత్తరకం మెషిన్‌పప్పు డిటో ఆఫీసు వెం 76-4-0 వేరుసెనగనూనె (ఇంగ్లీషు కాండి 500 పౌను గండి) 1-కి చెక్కు రకం స్థాకులేదు ఎక్సుపెల్లర్ (సేల్సుటాక్సుతో సహా) రు. 165-4-0 వెంకాయనూనె 38 పౌనుగలడబ్బా 1-కి కొబ్బరి కాయలు (పిలోసురకం) 1100-కి 130-0-0 150-0-0, రెండోరకం కొరదాచేరి 95-0-0; 105-0-0: ఆముదము (మిల్ డిలెవరి) ఎక్సుపెల్లరు పర్ ఇంగ్లీషు కాండి 500 పౌనులగండి 195-0-0 శక్కెర: కాన్పూరు 51-11-3, 52-5-9

బంగారు: వెండి: నేటి మధ్యాహ్నం 1 గంటకు పవను 1-కి (చిల్లరధర) 51-4-0 పెట్టా బంగారు తులం 75-14-0. పీమవెండి తులము 100-కి (రెడి) 131-8-0 తులం వెండి 1-కి 1-6-0

## న్యూయార్కు దూదిమార్కెటు

న్యూయార్కు, అక్టోబరు 10

న్యూయార్కు దూది: అక్టోబరు 23.12/23.12 డిసంబరు 23.30/23.30 జనవరి 23.25/23.25 మార్చి 23.36/23.36 మే 23.36/23.36 జూలై 23.17/23.19 అక్టోబరు 22.58/22.59 డిసంబరు 22.52/22.54

| | |
|---|---|
| జనవరి — | 22.42/22.42 |
| మిడ్లింగ్ హాజరు | 23.67 |
| అక్టోబరు (గరిష్ఠధర) | 23.35 |
| (కనిష్ఠధర) | 23.27 |

## డిసెంబరు వాయిదా ధరలు

| | |
|---|---|
| నేటి ప్రారంభం వెల | 23.31 |
| నిన్న .. | 23.38 |
| నేటి ముగింపు వెల | 23.30 |
| నిన్న .. | 23.33 |

